ప్రసిద్ధిచెందిన చిప్టిడైమండ్ ఆయిల్ ఎక్స్పెల్లరులు

భారతదేశమున తరతరాలనుంచి జేలకొలది పనిచేయుచున్నవి.

సోల్ ఏజంట్లు :
కె. యల్. నరసింహారావు అండ్ సన్సు,
ఇంజనీర్లు, బెజవాడ.



Reg. No. 1118.        విడిపత్రిక ఒక అణా.

# ఆంధ్రపత్రిక

316472        Founder ; K. NAGESWARA ROW

VOL 32· THE ANDHRA PATRIKA MADRAS, WEDNESDAY, 23-5-1945 No, 43





# "ప్రజాతంత్రం భారతదేశంలోలాగా మరెక్కడా దెబ్బతినలేదు"

## ప్రాజాపత్యపద్ధతివిషయంలో అగ్రరాజ్యాల అంగీకారం

### ధర్మకర్తృత్వసంఘంలో రష్యా, చైనాలకుస్థానం

### "స్వపరిపాలనతో బాటు స్వాతంత్ర్యం కూడా రక్షితరాజ్యాలు పొందకలగాలి"

శాన్‌ఫ్రాన్‌సిస్కో, మే 21: రక్షిత రాజ్యాలపై ధర్మకర్తృత్వపద్ధతి లక్ష్యము లలో "స్వాతంత్ర్యము"ను ఇముడ్చుటం విషయములో బ్రిటన్, చైనా, అమెరికాల మధ్య ఏకాభిప్రాయం కుదిరినట్లు తెలుస్తూవుంది. ఫ్రాన్సు రష్యాలకున్నూ ఇది అంగీకారము గానే వుంటుందనీ ఈ కొత్తవడ్డావల్ల ధర్మకర్తృత్వం విషయంలో ఉత్పన్నమైన అతిక్లిష్టసమస్య పరిష్కారమై పోయినదనీ రాయిటర్ ప్రతినిధి వ్రాస్తున్నాడు. ప్రాజాపత్య పద్ధతి ప్రాతిపదిక లక్ష్యముగా రక్షితరాజ్యాలున్నూ ప్రజలున్నూ రాజకీయ, ఆర్థిక సాంఘిక అభివృద్ధి పొందునట్లు చేయుట ఆయాదేశముల పరిస్థితులనుబట్టి స్వపరిపాలనకు లేక స్వాతంత్ర్యమునకు క్రమానుగత అభివృద్ధిపొందునట్లు చేయుట అని ఇప్పుడు నిర్వచనమైనది.

ఆనిలో స్వాతంత్ర్యప్రస్తావన చైనా ప్రతినిధి తెచ్చినారు. బ్రిటిషువారు గాని, ధర్మకర్తల కింద వున్న రాజ్యాలుగాని క్రమంగా స్వాతంత్ర్యాన్ని పొందవలసిందే అన్న చైనాసూచనను బ్రిటిష్ ప్రతినిధులు నిరస్కరించినారు. చాలా దేశాలు స్వపరిపాలననే కాంక్షించుచూ ఉంటునిగాని, స్వాతంత్ర్యం ఇచ్చినా నిలబెట్టుకోలేని స్థితిలో ఉండి ఏదో ఒక పెద్దరాజ్య ప్రాపకంలోపడి పోతవని వాదించినారు.

ప్రాజాపత్యపద్ధతికి చెందని రాజ్యాల ప్రసక్తిఏమీ ఈ మారిన లక్ష్యంలో లేదు. ప్రాజాపత్య సంఘములో రష్యా చైనాలకు సభ్యత్వం ఇవ్వడానికిన్నీ ఒప్పందం జరిగింది.

సర్వసమ్ముఖంగా సంయుక్తరాజ్యాల సభాకార్యక్రమం అభివృద్ధికరంగా సాగుతూ ఉన్నందున భద్రతాసంఘం సైనిక చర్య తీసుకోవలసివచ్చిన సందర్భములలో సలహా ఇవ్వడానికి అంతర్జాతీయ సైనిక సలహావర్గం ఏర్పాటుచేయడం ప్రస్తుతం అని అందరూ భావించుచూ వున్నారు. అవసర పరిస్థితులలో సంయుక్త సైనికచర్యలు నేవినంగా తీసుకోవలసింపీ నిర్ణయించుకుప మిలిటరీ స్టాఫ్ కమిటీని ఏర్పాటు చేయడానికి ఆలోచన జరుగుతూవుంది. ఈవిషయంలోనూ అంగీకారం కుదరవచ్చుననే తెలుస్తూ ఉన్నది.

2 వ పేజీ చూడుడు

## పండిత జవహర్లాల్ నెహ్రూ

### విపరీతమైన ఎండవల్ల దినచర్యలో మార్పు

బేరలీ (టపాద్వారా) పండిత జవహర్లాల్ నెహ్రూగారి ఖైదీ, విడుదలకు సంబంధించి ఊహాగానమును యిచ్చటివారు పూర్తిగా నమ్ముటలేదు. పండిత నెహ్రూగారును, ఆచార్య నరేంద్రదేవుగారును యింకను ఇజ్జత్‌నగర్ సెంట్రలు జెయిలులోనే, కొన్ని మాసములక్రిందటివరకు నర్సీ అహమ్మద్ కిద్వాయీగారు వసించుచుండిన బారకాసులలో నిర్బంధింపబడి యున్నారు.

ఈ బారకాసులలో విద్యుత్ పంకాలు లేనందువలనన్నీ, ఇటీవల చేతితోలాగు ఒక పంకా దానిలో అమర్చబడెననిన్నీ తెలియుచున్నది. ఎండలు దుర్భరముగా వుండుటవల్ల పండితుడు తన దినచర్యను మార్చెనని తెలియుచున్నది. ఉదయము ఆయన కొద్దిగా వ్యాయామము చేయును. తరువాత తోటపనిచేయును. మధ్యాహ్న సమయమున విశ్రాంతి తీసుకొనును లేదా యేదో చదువుచు, వ్రాయుచు నుండును. కొన్నిరోజులక్రిందటివరకు ఆయన వ్యాయామము చేయకుండెను. చేయి బెణుకుట చేత బాడ్‌మింటన్ ఆడుట కొంతకాలం ఆయన మానివేసెను. ముగ్గురు మిత్రుల సాహచర్యలాభము అధికారులు నెహ్రూగారికి యిప్పుడు కలుగజేసిరి. వీరిలో యిద్దరు కాంగ్రెస్‌వాదులు, మూడవ యతడు కమ్యూనిస్టు. వీరందరు కలిసి బాడ్‌మింటన్ ఆడుకొందురు.

పండితునికి నాను సం॥ రా॥ ప్రభుత్వము వారు దొక్కువ ద్రవ్యము ఖర్చుచేయుటలేదు. ఆయన ఆహారమునకుగాను వారానికి నాలుగు రూపాయలు వ్యయముచేయుచున్నది. ప్రతిరోజు పండితునికి ఒక పలావువన్న, ఆగానా ఋతువులయందు లభించు పండ్లు, ఫాలు, ఇతర కూరగాయలు లభించుచున్నవి.

పండితునికి ఏ దినపత్రికలు, కొన్ని మాస పక్షపత్రికలు, గ్రంథములు చేరుచున్నవి. క్రమము తప్పకుండ ఆయన ఉత్తర ప్రత్యుత్తరములు గావించుచుండును. ఇటీవల ఉత్తరములు చేరుట ఆలస్యమగుచున్నది. కాని యిప్పుడు పడలందించుచున్న పద్ధతివల్ల త్వరగా చేరుచున్నవి. విజయలక్ష్మీ పండిట్, కృష్ణా హుతీసింగు, ఇందిరా గాంధీలనుండియు, సన్నిహితులగు యితరులనుండియు ఆయనకు ఉత్తరములు వచ్చుచున్నవి. కాని ఆయనను చూచి మాటలాడుటకు ఆయన బంధువులెవ్వరు పదఘాస్తు పెట్టలేరు.

నాశావరణ పరిస్థితులలో వాతావరణ మార్పులు కలుగుచుండి నందువల్ల ఆహారము సరిపోక పండితనెహ్రూగారు బరువుతగ్గిరి. ఇక్కడ పనికన్నీటు పండితునికి ప్రైవేటు. కొద్ది కాలముక్రిందట ఆయనకు మైద్యసహాయము ముఖ్యమయ్యెను. కొద్దిగా ఇన్‌ఫ్లూయెంజా జ్వరము రావటంవల్లనే యిందుకు కారణమై యుండవచ్చును. పరుపుపాలై ఆయన చాలదినాలు తర్వాత లేచుచున్నారు. ఇప్పుడు ఆయనకు చాల నయముగా వున్నదనిన్నీ ఆరోగ్యం బాగుగానే ఉన్నదనిన్నీ తెలియుచున్నది. ఆయన ఆశావాదము విడుచుకొనుచున్నారు.

త్వరలో విడుదలైన తప్ప, పండితుని ఆరోగ్యం తిరిగి దెబ్బతినవచ్చును. ఇందుకై ప్రయత్నాలు జరుగుచున్నవి. కాబట్టి యుక్త సం॥ రా॥ ప్రభుత్వమువారు త్వరలో యుక్త నిర్ణయము గావించెదరని తెలుపవచ్చును.

## సోవియట్ పత్రిక ప్రావ్‌డా ప్రకటన

### ఇంగ్లీషు పత్రికల 'ప్రజాతంత్ర' వ్యాఖ్యానవిమర్శనము

మాస్కో, మే 21 ప్రజాస్వామ్యసంరక్షణ అంటూ కొన్ని ఇంగ్లీషు పత్రికలు ప్రజాతంత్ర విరుద్ధభావాలను ప్రచారంచేస్తున్నవని ప్రావ్డాపత్రిక విమర్శిస్తూ ఇలా వ్రాస్తున్నది.

"ప్రజాతంత్రము అనే పదానికి కొందరు ఇంగ్లీషువారు చెబుతున్న టీకా తాత్పర్యాలు వారి బ్రిటిష్ సామ్రాజ్యంలోనే గమనింపుకు వచ్చినవి. ఉదాహరణకు భారతదేశపు అమృతబజారు పత్రిక ఈ దండాన్వయమంతా గమనించింది: బ్రిటిష్‌ప్రముఖులు భారతవిధానంగురించి మాట్లాడేప్పుడు పవిత్రమైన ప్రజాతంత్ర రక్షణ భారతీయులు కావించినారని ధన్యవాదాలు చెబుతూ తమ బంధనను మూగిస్తూ ఉంటారని. ఈ ఇద్దకాలకు విసిగిపోతున్నామని అమృతబజారు పత్రికవ్రాసింది. యుద్ధం ప్రజాస్వామ్య సంరక్షణకోసమేనని వక్కాణిస్తూండగా మరెక్కడా సామ్యంలేని విధాన ప్రజారాజ్య సూత్రాలు భారతదేశంలో హానిచెందుతున్నవి.

"ఇలాంటి విచ్చలవిడి వ్యాఖ్యానానికి ఎకనమిస్ట్ పత్రిక దృష్టాంతమవుతున్నది. ఈ పత్రిక పోలండును ఖండించి పోలిషు రాజ్యానికి సంబంధించిన మూలంటుప్రశ్నలను పరిష్కరించుకోడానికి పోలిషు ప్రజలు 'అస్వాభావికమైన పరిపక్వత' కనబరుస్తున్నారని చెప్పి ఆ ప్రజారాజ్య విపరీతమైన పోకడగా భావిస్తున్నది. జాతీయస్వేచ్ఛ, ప్రజారాజ్యము సంబంధపడటం ఎకనమిస్ట్ అభిప్రాయము.

"సోవియట్ అపరిధంశకులు 16 మందికి నైరు చేయటం ప్రజారాజ్య విరుద్ధమని ఎకనమిస్ట్ ఎంచుకున్నట్టున్నది. ప్రజారాజ్య రక్షణ అనే ముసుగులో ఎకనమిస్ట్ మాయమాయగా విశేషములను సమర్థిస్తున్న సంగతి తేటతెల్లం అవుతున్నది.

"సృష్టి చూపించిన ఈ పత్రికా లేఖకులు ఏమి వ్రాసుకున్నప్పటికీ ప్రజారాజ్యమనే మహోత్కృష్టమూ, యూరపు ప్రజారాజ్యపరం చేయవలసిన కర్తవ్యమూ గుర్తిస్తారు. ప్రజా సందోహం స్వయం కార్యాలు సాధించాలని శక్తి మంతంగా పోరాడిన ప్రాణుకుంటం మార్పు చూపులేని ఈ రచయితలకు ప్రజారాజ్య విజయంగా తోచటంలేదు. పైగా బెదిరిపోతున్నారు."

## ఉడుమూమా ప్రాజెక్టు

### అగ్రిమెంటుమాట అసత్యం

చెన్నపట్నం, మే 22: ఉడుమూమా ప్రాజెక్టు సంబంధంలో మద్రాసు-ఒరిస్సా ప్రభుత్వములు అగ్రిమెంటుకవచ్చిన మాట అసత్యమనీ, లాభపరుప లెవరో ప్రచారము నిమిత్తము వార్తను సృష్టించియుండవచ్చునని మద్రాసు ప్రభుత్వవర్గముల మా ప్రతినిధి విచారించగా తెలియవచ్చినది.

మద్రాసు, ఒరిస్సా సరిహద్దుల పరిశీలించి మార్చి 15 నివేదికలు పంపాలని రిపోర్టు ఇవ్వవలసిందిగా మద్రాసు ప్రభుత్వమువారు ఒక స్పెషల్ కలెక్టరును నియమించిరనీ, ఆకరి నివేదిక రాని ఏ మద్రాసు ప్రభుత్వము ఏమీ చెయ్యరని తెలుస్తోంది. అయితే ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరములు ఇంకా జరుగుచున్నవని వారు అంటున్నారు.

## బ్రిటిష్ కార్మిక పక్షసభ

### మిస్ విల్కిన్సన్ అధ్యక్షప్రసంగం

### 'ఎవరు సాగించినా నియంతృత్వం నియంతృత్వమే'

బ్లాక్‌పూల్, మే 21: బ్రిటిషు కార్మికపక్ష సమావేశం ఈ ఉదయం ప్రారంభమైంది. మిస్ ఎల్లెన్ విల్కిన్సన్ ఈ సమావేశానికి అధ్యక్షురాలు. గత 22 సంవత్సరాలలో ఇంత ప్రధానమైన కార్మికపక్ష సమావేశం జరగలేదని రాయిటరు ప్రత్యేక విలేఖరి జార్కించి తెలియజేస్తున్నాడు.

కార్మిక ప్రతినిధులు 1100 మంది ఈ మహాసభకు హాజరైనారు. ఎట్టి పరిస్థితి ఏర్పడినప్పటికీ ఎదుర్కోడానికి కార్మికపక్షం సంసిద్ధమై వున్నదని మిస్ విల్కిన్సన్ ఘంటాపథంగా ఉపన్యసించింది. ప్రస్తుతం పరిపాలన సాగిస్తున్న మిశ్రమ మంత్రివర్గంలో కార్మికపక్షం వుండదైనావుండాలి. లేదా త్వరలోనే పార్లమెంటు ఎన్నికలకు ఒప్పుకోనైనా ఒప్పుకోవాలని బ్రిటిషు ప్రధాని చర్చిల్ చేసిన సవాలును కార్మికపక్షం ఎదుర్కోడానికి తయారుగావున్నది.

ఈ సమావేశంలో ఒక విషయం మాత్రం ప్రబలంగా కనిపిస్తున్నది. పార్లమెంటు ఎన్నికలకు జూలై నెలలో జరపవద్దని సైన్యోద్యోగసమాపనానంతరం కొంతమంది పురుషులు, స్త్రీలు స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాతే జరుపవలెనందనీ కార్మిక నాయకులు పట్టుబడుతున్నారు.

మిశ్రమ మంత్రివర్గానికి ఇంతటంటే పగాగవ స్పష్టీ చెప్పటం అవసరమనీ, అందువల్ల ఎన్నికలు శరదృతువులో (ఆకురాలేకాలం) జరపటం మంచిదనీ మిస్ విల్కిన్సన్ ఉద్ఘాటించింది.

### కార్మికపక్ష విధానం: మిస్ విల్కిన్సన్ ప్రకటన

బ్రిటిషు కార్మికపక్ష భవిష్యద్విధానాన్ని గురించి మిస్ విల్కిన్సన్ ప్రధానమైన ప్రకటన చేసింది. అందులోని విశేషాలు: "గత మహాసంగ్రామానంతరం మనం ఘోరమైన తప్పిదాన్ని చేశాము. జర్మన్ వైమార్ రిపబ్లిక్‌కు సంబంధించిన ప్రజాస్వామ్య నాయకులకు యుద్ధ నేరస్థులను పొదినట్లు చూశాము. మనం ఆనాడు ఆ జర్మన్ నాయకుల ఎడల మానవవిధానానికి, చేంబర్లేన్ ప్రభుత్వం నాజీల ఎడల చూపిన విధానానికి ఏమిగామైన పోలికలేదు.

### నియంతృత్వమే!

ఇటీవలనే శాన్‌ఫ్రాన్సిస్కోనుంచి తిరిగివచ్చిన మిస్ విల్కిన్సన్ ఆవ్యభిచారోపన్యాసంలో ఇలా చెలియజేసింది:

"ప్రపంచశాంతిని అగ్రరాజ్యాలు సమైక్యంగా కాపాడవలసి వుంటుంది. అగ్రరాజ్యాలంటే బ్రిటన్, అమెరికా, రష్యాలే. జర్మనీ కార్మికులతో ఒకజాతి సాగించినా, అగ్రరాజ్యాలుసాగించినా నియంతృత్వం నియంతృత్వమే అనిపించుకుంటుంది."

మధ్యాహ్నభోజనానంతరం సభ్యులు పార్లమెంటు ఎన్నికల సమస్యను చర్చించడానికి రహస్యసమావేశం జరిపారు. ఈ వారంలోనే బ్రిటిష విదేశాంగవిధానంపై ప్రధాని అట్లీ, కార్మికమంత్రి ఎర్నెస్ట్ బెవిన్ ఉభయులూ ప్రసంగిస్తారు.

భారతసమస్యపై జెనిన్‌బర్ ప్రకటన చేయం చేస్తాడని, విమాన ఉత్పత్తిశాఖా

(2 వ పేజీ చూడుడు)

## ట్రీస్టీ నుంచి మార్షల్ టిటో సేనాపతుల నిష్క్రమణ

### ఇటలీతో నే సంప్రతించడానికి యుగోస్లావియా సంసిద్ధత

ట్రీస్టీ, మే 21 : యుగోస్లావ్ అధికారికి ఫీల్డు మార్షల్ అలెగ్జాండర్‌కూ ఘాటైన వాద ప్రతివాదాలు జరిగినమీదట మార్షల్ టిటో సేనాధిపతులు ఇవ్వాళ ట్రీస్టీనుంచి తమ ప్రధాన కార్యాలయాన్ని తరలించారు. కాని నగరంలో సైనికాధికారం ఇంకా యుగోస్లావియావారి చేతుల్లోనే వుంది.

టిటో అనుగామియైన దేశభక్తులతో పోరాడిన ఇటలీ గారిబాల్డీ దళం ఇవ్వాళ నగరంలో సారేక్ చేసింది.

ట్రీస్టీ పత్రికలలో టిటో ప్రకటనలను మాత్రమే ప్రచురించారు. అలెగ్జాండర్ ప్రకటనలను ప్రచురించలేదు. నగరంలోని మిత్రసేనలన్నీ చాలా కలిసి మెలిసి ఉంటున్నాయి.

క్లాజెన్‌ఫర్ట్, ఆ స్ట్రియాలనుంచి కూడా తప్పుకోడానికి యుగోస్లావియా వారు అంగీకరించారన్న దానిని అప్పుడే నమ్మడానికి వీలులేదు. (అ. అ. ప్రె.)

### 'కోస్తాప్రాంత సమస్యను ఇటలీతోనే చర్చిస్తాం'

మార్షల్ టిటో ప్రకటన

లండన్, మే 21: ఇట్రీ గా, ట్రీస్టీ కోస్తాప్రాంత సమస్యను యుగోస్లావియా వారు ఇటలీతోనే సంప్రదించి పరిష్కరించుకొంటారనీ, శాంతి సమావేశానికి ముందే ఇది జరుగునుందని మార్షల్ టిటో ప్రకటించినట్లు బెల్గ్రేడ్ రేడియో చెప్పారు.

ఆప్రకటనలో మార్షల్ టిటో సందు అంశాలను గూర్చి చెప్పాడు. పరిగో ఈ ప్రాంతాన్ని శాంతిసమావేశాన్ని ముందే స్వతంత్రించి ఆక్రమించుకోవాలని యుగోస్లావియావారు లేదు. ఈ విషయాన్ని ఇటలీతోనే సంప్రదించి పరిష్కరించుకోవాలని వారి ఉద్దేశం. ఇందు: ఈప్రాంతాల పూర్తిగా విషయంలో ఆ ప్రాంతీయుల

(2 వ పేజీ చూడుడు)

## భారతసమస్య ఎడల మూకీభావం?

### అధికారంలోకి వస్తే తిరిగి పాతవైఖరేనా?

(యునైటెడ్ ప్రెస్)

బ్లాక్‌పూల్, మే 21 : బిర్లిష్ కార్మికపక్షసమావేశంవిజ్ విల్కిన్సన్ అధ్యక్షతక్రింద ప్రారంభమైంది. పార్లమెంటు ఎన్నికలు జూలై నెలలో తప్పక జరుగుతవనే చెప్పవచ్చు. కార్మికపక్షసభ్యులకే మెజారిటీ వచ్చే సూచన స్పష్టంగా కనిపిస్తున్నది కూడా. ఈ సమావేశంలో కార్మికసభ్యులు చేసే నిర్ణయాలు బ్రిటను దేశీయాభివృద్ధి కార్యక్రమంలోనేగాక, ఆ యుద్ధానంతర అంతర్జాతీయ విధానంలో కూడా పెద్ద మార్పులను తీసుకుపవచ్చును. "ప్రోగ్రెస్" పరిపాలన్ని కలసి, ఇతర పక్షాలకు ఓడించడానికి పూనుకోవలెనా అనే ప్రశ్నా పరిష్కారం బ్లాక్‌పూల్ సభలో కార్మిక పక్షం చర్చిస్తుంది. వివిధ "లెఫ్టిస్ట్" పక్షాలు ఎన్నికలలో కలసి పనిచేయాలనే అంశం గత కార్మికపక్ష సభలో ఓడిపోయింది. ఇక కనీసం యూదు సంవత్సరాల వరకైనా ఆ ప్రసక్తిని తిరిగి తీసుకురావడానికి వీల్లేదు.

ప్రముఖ ట్రేడ్ యూనియన్ సంస్థలన్నీ, వివిధ కార్మికసంఘాల నిర్మాణ కృషి సమస్యను కూడా చర్చించ వలసిందని కార్మిక సమావేశాన్ని కోరుతున్నారు. అంతర్జాతీయ కార్మికసంస్థ తరపున ప్రొఫెసర్ హెరాల్డ్ జె. లాస్కీ సూచనను ప్రతిపాదించబోతున్నారు. ఎన్నికలు అచిరకాలంలో జరగబోతున్నవి కాబట్టి, మిగతా పక్షాలతో రాజీ బేరాలు సమర్థనీయమని లాస్కీ వాదన. కొన్ని తీసుకొని కార్మిక సభ ఈ అంశాన్ని నిర్ణయిస్తుంది. గత సమావేశంలో నిర్ణయించిన సమగ్ర జాతీయ విధానం ఏమైందని సభలో కొన్ని విమర్శలు రావచ్చు. భారత సమస్య విషయం ఏమిటని మరో ప్రశ్న? భారత సమస్యను గురించి సభలో ప్రత్యేకంగా చర్చజరగదేమో ననిపిస్తున్నది. భారత స్వాతంత్ర్యం, వలసరాజ్యాల భవిష్యత్తు, ఈ విషయాలను గురించి చాలా ప్రాయమైనప్రసక్తిరావచ్చు. ఈ ప్రధానమైన భారతసమస్య ఎడల కార్మికపక్ష అధికారవర్గాలు ఎందుచేతనో మూకీభావమై ఖరిని అవలంబిస్తున్నవి. ఈ మూకీభావం కేవలం యుద్ధంకోసం అవలంబిస్తున్నదేగాని, భారతపరిష్కారం ఎడల కార్మికపక్షానికు అశక్తిలేక కాదని తెలుస్తున్నది.

## ప్రస్తుతంఎన్నికలు పనికిరావు

### చర్చిల్‌కు అట్లీ సమాధానం

### ప్రజాభిప్రాయం కనుగొనాలని ప్రధాని సూచన

లండను, మే 21 : ప్రస్తుతం ఎన్నికలు జరిగితే యుద్ధకార్యాలలో పాల్గొంటున్న వారిలో తీవ్ర స్పర్థలేర్పడటం నిశ్చయం. కనుక ఈవిషయమై మీ నిర్ణయాన్ని ఇంకోసారి ఆలోచించండి. ఏమైనాసరే జులైలో ఎన్నికలు జరగాలసిందేనని మీరు నిర్ణయించేటట్లయితే అందువల్ల వచ్చే కష్టనష్టాలకు మీరే బాధ్యులౌతారు." అని కార్మికపక్ష నాయకుడు క్లిమెంటు ఆట్లీ చర్చిలుకు సమాధానం వ్రాశాడు.

### చర్చిలు ఉత్తరం

చర్చిలు ఆట్లీకి ఈవిధంగా వ్రాశాడు: మీ తోనూ, మీ పార్టీ పెద్దలతోనూ మాటలాడినప్పుడు ఈ శరదృతువు వరకూ సంకీర్ణ మంత్రివర్గం కొనసాగడానికి కార్మిక పక్షం కలసి వస్తుందన్న అభిప్రాయం కలిగింది నాకు ఇప్పుడు మీరు చెంన నిర్ణయం ప్రజాక్షేమాన్ని దృష్టిలో ఉంచుకోక చేశారని అనుకోలేకపోతూ ఉన్నాను.

ఇప్పుడున్నట్లు అన్ని పక్షాలవారూ కలిసి ఉండటం, ప్రపంచపరిస్థితు లేమైనా సరే ఫలానా తేదీవరకూ అని కాక, ఒక ఉత్కృష్ట ప్రయోజనం కొరకు అయి ఉండాలి. 'జర్మనీ యుద్ధం అయిపోయింది. ఎన్నికలు దగ్గరకు వస్తున్నాయి. అన్నభావం వల్ల గత ఐదారు మాసాలలో పరిపాలనా వ్యవహారాలు చాలా అస్తవ్యస్తం అయినాయి. ఇది దేశానికి మంచికాదు.

కనుక మనం ఇంకో లక్ష్యం పెట్టుకొని అది సాధ్యం అయేవరకూ కలిసి పని చేయాలనే నా కోరికను మీరు నిరాకరించవద్దని మనవి.

జపాన్ యుద్ధం అవకముందే ఎన్నికలు జరపనంపల్ల నౌకాశాఖ మంత్రి ఆల్బర్ట్ అలెగ్జాండర్ విచారం వెలిబుచ్చాడు మీరు మీపార్టీ హితులూ జపాన్‌పై జయం సంపాదించేవరకూ మాతో కలిసి ఉంటామంటే నాకు చాలా సంతోషం.

ఈలోగా మనం, సాంఘిక భద్రత మొదలైన విషయాలలో మనంచేయవలసిన కొన్నిటిని చేయడానికి కాయశక్తులా ప్రయత్నిద్దాం.

కావాలిస్తే ఈవిషయమై ప్రజాభిప్రాయంకూడా కనుక్కొందాం. ఈపార్లమెంటు వ్యవధిని ఇంకా పొడిగించవలెనా లేదా అనే అంశంపై ప్రజాభిప్రాయం తీసుకొందాం."

జపాన్ యుద్ధం అయేవరకూ సంకీర్ణ మంత్రివర్గం కొనసాగేటట్లు చేయాలన్న చర్చిల్ కోరికను కార్మికపక్షం కార్యవర్గంవారు ఏకగ్రీవంగా నిరాకరించిన తర్వాత కొద్ది గంటలకు చర్చిల్ ఈ ఉత్తరం వ్రాశాడు.

ఈ అభిప్రాయాలతోనే సర్ ఆర్చిబాల్డ్ సింక్లైర్ కూ, ఎర్నెస్టు బ్రౌన్‌కూ కూడా ఉత్తరాలు వ్రాశాడు. సర్ ఆర్చిబాల్డు సింక్లేర్ అసలు మితవాదపక్షం నాయకుడు. బ్రౌనేమో 1931-లో అసలు పక్షంనుండి విడిపోయిన మితవాదుల నాయకుడు.

### సింక్లేర్ సమాధానం

చర్చిల్ వైఖరి చాలా విపరీతంగా ఉందనీ ఇదివరకు చాలాసార్లు బహుమైన కారణాలతోనే ఇలాంటి సూచనలు త్రోసివేయబడ్డాయనీ, ఏమైనా ప్రజాభిప్రాయాన్ని కనుగొనేందుకు మార్గాలు వెతకడం మునిపేపనీ సింక్లేర్ చర్చిల్ ఉత్తరానికి ప్రత్యుత్తరం వ్రాశాడు.

జపాన్ యుద్ధం అయేవరకూ జాతీయ ప్రభుత్వాన్ని చర్చిల్ నాయకత్వాన ఉంచడం విషయాన్ని చర్చిల్‌తోనూ, అట్లీతోనూ చర్చించడానికి కూడా తన అంగీకారం తెలిపాడు అతడు.


# DENA BANK
DEVKARAN NANJEE BANKING Co. LTD.

హెడ్డాఫీసు; దేవ్‌కరణ్ నాంజీ బిల్డింగ్సు, ఫోర్టు, బొంబాయి.

| | | |
|---|---|---|
| అనుమతిపొందిన మూలధనము | .... | రు. 1,00,00,000 |
| చందావేయబడి చెల్లించిన మూలధనము | .... | రు. 50,00,000 |
| రిజర్వుఫండు | .... | రు. 12,00,000 |
| 30—4—1945 వరకు మొత్తము డిపాజిట్లు | .... | రు. 7,68,50,312 |
| 30—4—1945 వరకు మొత్తము వర్కింగ్‌ఫండ్సు | .... | రు. 9,12,30,312 |
| 30—4—1945 వరకు అకౌంట్ల మొత్తము | .... | రు. 39,043 |
| బ్రాంచీల సంఖ్య | .... | రు. 41 |

దేనా బ్యాంకు సర్వీసెస్
* బ్యాంకింగ్ సర్వీసులు
* సేఫ్ డిపాజిట్ వాల్టు
* క్యాష్ సర్టిఫికెటులు
* ఇన్‌వెస్టుమెంటు సర్వీసు
* సేవింగ్సు యిన్సూరెన్సు
* చిన్న వెండి పెట్టెలు
* ఆదివారము సేవింగ్సు సర్వీసు.

| | | |
|---|---|---|
| బొంబాయి | నాసిక్ | షోలాపూర్ |
| తకూర్‌ద్వార్ | నాసిక్ సిటీ | సూరత్ |
| సాండర్స్టు బ్రిడ్జి | నాసిక్ రోడు | రణపీట్ |
| కాల్బాదేవి | ఆనంద్ | బురహాన్‌పూరి బాగోల |
| మాండ్‌వి | అహమ్మదాబాద్ | భవనగర్ |
| జవేరి బజార్ | గాంధి రోడ్డు | బరోడ |
| ధులేశ్వర్ | మస్కటి మార్కెట్ | బర్‌హాంపూర్ |
| దాదర్ | మానెక్ చౌకు | సిటి |
| కొలాబా | ఢిల్లీ చక్లా | మిల్ సబ్ ఆఫీసు |
| షేర్ బజార్ | నవసారి | అహమ్మదనగర్ |
| మాటుంగ | పూనా | అంధేరి |
| బొంబాయి పరిసరాలు | బుద్వార్ పేట | రాజ్‌కోట |
| బార్ | రవివార్‌పేట | పాలన్‌పూర్ |
| సాంతా క్రూజ్ | క్యాంపు | గోద్రా |
| విలే పార్లే | జునగాడ్ | నడియాద్ |
| వాఘాన్ క్యాంపు | మాహిమా | బుల్‌సార్ |

దేనా బ్యాంకు బ్రాంచి జార్జిటౌన్ 29, లింగిచెట్టివీధి మద్రాసులో, 5-6-1945 మంగళవారంనాడు తెరువబడును.

ప్రవీణ్‌చంద్ర వి. గాంధి, మేనేజింగు డైరెక్టరు.

